कौक्षेयकः समाख्यातः पुरुषाकारपोगरः ।
एरण्डबीजसंकाशपोगरस्तारपट्टकः ॥६७॥
रामारोमावलिश्यामो न नमेन्नामितोऽप्यसिः ।
नववारिधरश्यामः पिंगाकुंचितपोगरः ॥६८॥
खङ्गः षढालको नाम विषवज्रभयापहः ।
स्वर्णचञ्चूनिभैः सूक्ष्मैः पोगरैः स्वर्णपंजरः ॥६९॥
मुक्ताचूर्णसमाकारैः ख्यातस्तित्तिरवज्रकः ।
पोगरैः कज्जलप्रख्यैः खङ्गः स्यात्कालवज्रकः ॥७०॥
वियच्छायावपुः सारः स्वल्पपांडुरपोगरः ।
सरोजिनीच्छदच्छायः कोंगिः खङ्गोऽभिधीयते ॥७१॥
कदलीशृंखला वापि यस्मिन् दृश्यान्तरान्तरा ।
वर्णपोगरभेदेन खङ्गजातिर्निरूपिता ॥७२॥

(प्रथमोऽध्यायः)

[Śomēśvara'sMānasōllāsa, Gaekwad Oriental Series, Ādhyaya IV (Slokas 44-72)]

## APPENDIX III

### शिवतत्त्वरत्नाकरे

प्रमाणदोषरेखाश्च जातिं देशांश्च देवताः ।
ज्ञात्वैव खङ्गमादद्यादायुस्सौभाग्यवृद्धये ॥१॥
पञ्चाशदंगुलं श्रेष्ठं चत्वारिंशाच्च मध्यमम् ।
षट्त्रिंशद्भिः कनिष्ठं स्यात् स्वांगुष्ठोदरनामकम् ॥२॥
स्फुटितं पिटकं विद्धं भग्नरेखं त्वचोद्धृतम् ।
जलमार्गं जलद्रावि सिह्मलं वक्रधारिणम् ॥३॥
इति दोषास्समाख्याताः फलं तेषां क्रमाद् ब्रुवे ।
स्फुटितेन भवेन्मृत्युः पिटको गोत्रघातकः ॥४॥
विद्धाद्दारिद्र्यमाप्नोति भग्नात्कीर्तिर्विनश्यति ।
जलमार्गाद् भवेद्भंगो जलद्रावी भयावहः ॥५॥
सिह्मले कुष्ठदारिद्र्यं वक्रधारो द्युतिं हरेत् ।
प्राकारशंखचक्राणि तोरणं चामरं ध्वजम् ॥६॥
मत्स्यकूर्मादिमालांकं शोभनं खङ्गमीदृशम् ॥
लिंगं सपीठं दृश्येत यस्मिन् खङ्गे सुनिर्मले ॥७॥

तं खड्गं धारयेद्राजा आयुरारोग्यकारकम् ।
(प्राकारो दृश्यते यत्र गरुडश्च सुनिर्मलः ॥८॥
तं खड्गं धारयेद्राजा विषवज्रभयापहम् ।)
हंससारसभेरुण्डचक्रवाककपिंजलाः ॥९॥
दृश्यंयते यस्य खड्गे तु तस्य श्रीर्विजयो भवेत् ।
एरंडबीजसच्छायः पिशाचलिपिसंनिभः ॥१०॥
केतकीफलसंकाशश्शुभप्राकार ईदृशः ।
तरुणीकेशसंकाशं प्राकारैर्दृश्यसूक्ष्मकैः ॥११॥
पंजरं नाम तल्लोहं जांगले तु समुद्भवम् ।
लिंगं सपीठं दृश्येत प्राकारो दृश्यसूक्ष्मकः ॥१२॥
स्थूलदीर्घश्च मध्ये तु बहुवर्णतिलांशकैः ।
अनूपदेशजं लोहं सुकृष्णं कृष्णपंजरम् ॥१३॥
प्राकारैः कुण्डलाकारैर्यद्वा खंडेन्दुसन्निभैः ।
हलकोदंडसंकाशैर्लोहं सादरणोद्भवम् ॥१४॥
प्राकारैर्वर्तुलैर्दीर्घैः प्रियंगुच्छाययान्वितैः ।
सुवर्णपंजरं नाम लोहं कालिंगसंभवम् ॥१५॥
भुजंगगतिसंकाशैस्तैलबिन्दुसमन्वितैः ।
प्राकारैर्दृश्यते यत्तु लोहं कांभोजसंभवम् ॥१६॥
प्राकारैर्नीलवर्णैश्च दीर्घसूक्ष्ममनोहरैः ।
नीरसारं तु तल्लोहं नि नीलपर्वतसंभम् ॥१७॥
तैलबिन्दुसमाकारैर्लतामंडलसन्निभैः ।
कृष्णसारं तु तल्लोहं घूर्जरेषु समुद्भवम् ॥१८॥
सुपांडुरैस्तु सुस्निग्धैः प्राकारैस्सूक्ष्मदीर्घकैः ।
श्वेतसारं तु तल्लोहं महाराष्ट्रसमुद्भवम् ॥१९॥
प्राकारैर्वर्तुलैः सूक्ष्मैः पाण्डुच्छायैस्सुनिर्मलैः ।
मेदिकं नाम तल्लोहं कर्णाटेषु समुद्भवम् ॥२०॥

पंचमकल्लोले

(Śivatattvaratnākara of Basavarāja.
V Kallōla IX-Tarañga (Silokas

# పీఠిక.

---

## ఖడ్గలక్షణశిరోమణి.

తెనుఁగు భాషలో శాస్త్రీయ గ్రంథములు ప్రత్యేక వాఙ్మయ శాఖగా పరిగణింపఁదగిన విలువగలవి. కాని నిన్న మొన్నటివఱకు నీగ్రంథములకు పర్యాప్తమైన పరిశీలనలేదు. ఈశాఖా సంబంధములైన గ్రంథములన్నియు, ససిగా, చక్కఁగా, పరిష్కృతములై, ముద్రితములై, వ్యాప్తినందినగాని, తొల్లిసర్వాంగ సంపన్నముగా వెలసిన తెనుఁగు సాహిత్య స్వరూపము తేటతెల్లముకాదు. కావ్యలక్షణములును, కవితారీతులును, కవిప్రతిభయును వెల్లడికాదు. ఇట్టిపరిస్థితిలో మదరాసు రాష్ట్రీయ ప్రభుత్వమువారు, దేశభాషలలోని ప్రాచీన గ్రంథము లచ్చుకూర్పించుటకుఁ దలపెట్టుటయు నందు ముఖ్యముగా, సంగీతము, వైద్యము, జ్యోతిషము వేదాంతము చరిత్రమున్నగు శాస్త్రీయ గ్రంథములకుఁ బ్రాధాన్య మొసంగుటయు మిక్కిలిగా భాషాభిమానులందఱును ప్రశంసింపఁదగినది. ఈ ప్రణాళికలో తెనుఁగు భాష లోవెలువడిన శాస్త్రీయ గ్రంథములలో నీ ఖడ్గలక్షణ శిరోమణి యొకటి.

### — గ్రంథప్రశస్తి. —

ఈ గ్రంథము పేరునుబట్టి యిది కత్తులను వానిస్వరూపములను వివరించునది యని తెలియుచునేయున్నది. తెనుఁగులో నింతవఱకు ప్రత్యేకముగా ఖడ్గములనుగూర్చిన పద్యరూపగ్రంథములేదు. మఱియొక విశేషమేమనగా నీ గ్రంథము దక్షిణదేశమున పుదుక్కోటలో పుట్టినది. కాబట్టి శాస్త్రీయ గ్రంథముగానే గాక, దక్షిణాంధ్రసారస్వతమునకు సంబంధించిన గ్రంథముగా నిదిపరిగణితముకాఁదగినది.

## — గ్రంథస్వరూపము. —

దీని మాతృక యొక్క వ్రాతప్రతి మాత్రమే లభించినది. అది డి. 2667 సంఖ్యగా మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునను్నది. ఆ ప్రతి వివరములివి.

"కాగితము నెం. డి. 2667 (పొడవు $13\frac{1}{4}$" వెడల్పు $8\frac{1}{2}$) పుటలు 19 పుటకు 26 పంక్తులు. వ్రాత చక్కగనేయున్నది. కాని తప్పులుగలవు. పద్యపాదములలో నచ్చటచ్చట లోపములుగలవు. ప్రతి సమగ్రముగ నున్నది. ఒక్క ప్రతిమాత్రమేగలదు.

ఆంధ్రసాహిత్యపరిషత్తు (కాకినాడ) పుస్తకభాండాగారమున 95 సంఖ్యగా కత్తులలక్షణము తెలుపు చిన్న పుస్తకముఁగలదు. కాని యది యీగ్రంథముననుసరించి వచనములో వ్రాయఁబడినది. అదిన్నైన సమగ్రముగాదు.

ఈ గ్రంథములో 77 పద్యములునొక పెద్దవచనము షష్ఠియొక చిన్నవచనమును గలవు. మొత్తం 79. వీనిలో 1 చంపకము, 1 ఉత్పలము 15 కందములు 14 గీతములు 46 సీసపద్యములుగలవు. లభించిన ప్రతి యొకటియే యగుటచేతను, సాంకేతిక పదజాలము విశేషముగ నుండుట చేతను,గ్రంథ విషయములోపింపకుండ స్వల్పసవరణములుచేసి యథా మాతృకముగ నిది ముద్రింపఁబడినది,

## — గ్రంథకర్త కాలము —

దీనిని రచియించిన కవి నవనప్ప. నల్లపిచ్చయ్య కుమారుఁడు. ఈతనికులగోత్రములు తెలియరాలేదు. కాని యీతఁడు ఖడ్గములను గూర్చి పూర్తిగా తెలిసిన యీక్రింది వ్యక్తులనే పేర్కొనుటచేత, నీతఁడును నా విశ్వకర్మ శాఖకు సంబంధించిన వాఁడని గ్రహింపవచ్చును,

1, తిరుమలచిదంబరుఁడు – ఇతఁడువిశ్వకర్మను మించిన ప్రజ్ఞగలవాఁడు.

2. చిగిలి లక్ష్మారాముఁడు – సకలఖడ్గముల క్రమము నెఱిఁగినవాఁడు

3, శెంకిసుహూలు – పనివారలందఱిలో పండితుఁడు

4. ఆపకుశాయి – ఖడ్గపరీక్షయందు నిపుణుఁడు

5. సుభాభక్తుఁడు – పై లక్షణములన్నియు గలవాఁడు గొప్పపనివాఁడు

నవనప్ప తనతండ్రి నల్లపిచ్చయ్య రాయరఘునాథరాజుచే సమ్మానితుఁడనియు, తాను రాయరఘునాథరాయలు, తిరుమలవజీరుఁడు వారల తనయుఁడైన విజయరఘునాథరాజును నాజ్ఞయీయఁగా నీ కృతి రచించితిననియు చెప్పుకొన్నాఁడు. (7–9 పద్యములు) పై వారిలో రాయరఘునాథరాజు, పుదుక్కోటను క్రీ. శ. 1769–89 వఱకును పాలించిన తొండమానురాజు. ఇతడు భాషాపోషకుఁడగు విద్వత్ప్రభువు, ఈతని వెనుక విజయరఘునాథరాజు రాజ్యమునకువచ్చి క్రీ. శ. 1789–1807 వఱకును పాలించెను, కాబట్టి యీకవియు క్రీ. శ, 1780 ప్రాంతమున నున్నవాఁడని చెప్పవచ్చును.

## — గ్రంథవిషయము —

ఈ గ్రంథమున అసితో మొదలుగా ముప్పదిరెండాయుధములును పేర్కొనఁబడినవి, ఆవెనుకవానిలో ముఖ్యమైన 'అసి' యను ఖడ్గమునకు ప్రత్యేకముగా 'లక్ష్మీనారాయణ సంవాదము' అను గ్రంథమున లక్షణములు చెప్పఁబడియున్నవనియు, తానుదాని ననుసరించితిననియు కవి చెప్పినాఁడు, కాని యాగ్రంథ మిప్పుడెచ్చటను గానరాదు, ఆవెనుక నూటనలుబదిమూఁడు విధములగు నాయుధములను వానిలక్షణములు తెలిపియున్నాఁడు, కవినవీనుఁడగుటచేత నితర భాషాపదములను, సాంకేతిక పదములను వాడియున్నాఁడు, ఫిరంగి, సైపు (అరబీపదము) బందరు సూరై, త్యాగ, ఖండామిశ్రి అబ్బాసి మొదలగునవి ఉద్ధూపకములు, ఇవి పారశీకభాషనుండి వచ్చినవగుటచేత, భాషోద్ధారకులు బ్రౌనుదొర

వారు వీనిని తమ నిఘంటువులో (1852 ముద్రణము) నిచ్చియున్నారు పైవానిలో "ఫిరంగు" అనునది, యగ్నిహోత్ర సంబంధమగు నాయుధమని అది చేతితో నుపయోగింపబడునది కాదని మనకొక యభిప్రాయము కాని యిదియు కత్తులలో నొకభేదమని ఈ గ్రంథమునుబట్టి, నిఘంటువును బట్టి తెలియచున్నది. ఖండా పదము తెలుఁగుకవు లుపయోగించిన పదమే.

తెలుఁగు దేశమున ఖడ్గమున కనేకపర్యాయ పదములున్నను, అసి పదము వేదకాలమునాటి ప్రాచీనపదమైనను, "ఖడ్గతిక్కన" "ఖడ్గ నారాయణ" మొదలగు బిరుదనామములు ఖడ్గశబ్దప్రసిద్ధినే సూచించుచున్నవి.

నవనప్ప ఈగ్రంథమును 'అసి' ప్రబంధము అనిచెప్పి ఖడ్గ లక్షణశిరోమణి యని దీనికిపేరుపెట్టుటయే పైపదవ్యాప్తిని రూఢిపఱచుచున్నది.

"పిట్టకొంచెము - కూతఘనము" అనునిట్టిది చిన్నగ్రంథమేయయ్యును, బహుప్రాచీనమగు ఖడ్గపరిశ్రమకు సంబంధించినది. తెనుఁగున శాస్త్రీయగ్రంథ పరంపరకేగాక దక్షిణాంధ్ర వాఙ్మయమునకు జెందినది గావున ముద్రణమునకిదియే ప్రథమ ప్రయత్నము. రాబోవుముద్రణమున నింతకన్న విశేషములు తెలుపుటకు వీలుకలుగును. గ్రంథవిషయ మాంధ్రదేశమునకే గాక యఖిలభారత వర్షమునకు నాదరణీయ మగుటచే నాంగ్లేయభాషలో విపులముగా తెలిపితిని. భాషాసారస్వత పరిశోధకులును ధనిక ప్రాజ్ఞులును నీగ్రంథమునాదరించి, యింకను నిట్టి శాస్త్రీయ గ్రంథములను ప్రకటించుటకు ప్రభుత్వమువారిని ప్రోత్సహింతురుగాత!

నిడుదవోలు వెంకటరావు, ఎమ్. ఏ.,
తెనుఁగు భాషాశాఖాధ్యక్షుఁడు
మదరాసు విశ్వవిద్యాలయము

చెన్నపురి
26 - 1 - 50

శ్రీ.

# ఖడ్గలక్షణశిరోమణి

క. శ్రీమద్గౌరీభాసుర
నేమాంగు కృపారసౌఘ నిబిడాపాంగున్
వేమరు మది భావింతును
కామితఫలదైకమతిని కైలాసపతిన్. 1

క. శ్రీకరముగ అసిశాస్త్రము
నీకరుణను నేర్చి నంతనే రచియింతున్
లోకులు (మది) మెచ్చఁగ నా
వాకున భారతిని నిల్పవయ్య మహేశా. 2

క. ఇష్టులు మెచ్చఁగ నీకృతి
స్పష్టము వెలయింపు మిపుడు పరిపూర్ణుఁడవై
కుష్ఠును గుల్మము వః అయును
కష్టములను జగతి తెచ్చు కైలాసపతీ. 3

క. భువనముల కీర్తి వెలయఁగ
భవదర్థము నీయసిప్రబంధమొనర్తున్
జీవమున ననురక్షింపుము
కవిసన్నుత వెలయు నీవె కైలాసపతీ. 4

క. అవివేకులైన వారికి
కవితావిభవం బవిఘ్నగతి దయజేసే
సవరణనీదేగావున
భవదంఘ్రులు గొలిచి విఘ్నపతి భజియింతున్. 5

వ. ఇట్లు యిష్టదేవతాప్రార్థనంబు జేసి, 6

గీ. రాయశ్రీరఘునాథతిర్మల వజీర
దత్తనయ విజయరఘునాథ (ధరణి) పతులు
అమితమతి యాజ్ఞనుతి గన్ననమనయాఖ్యుఁ
(డయిన నీ) ఖడ్గకృతిపల్కు నవసరమున. 7

సీ. విశ్వకర్మను మించు వెలయు తిరుమలచి
దంబరుఁడను నట్టి ధార్మికుండు
సకలఖడ్గములెల్ల సరవిగా తెలిసిన
చిగిలి లక్ష్మారామశీలవరుఁడు
పనివారికెల్లను పండితుఁడైనట్టి
శెంకిసుమాలైన చెల్వుఁడరయ
మేదిని లోపలమెచ్చు పరీక్షైన
ఆపకుశాయినే యందగాఁడు

ఇందరెల్లను నిజమని యేర్పరించు
జయముగలవాఁడు పనిచేతజంగమయ్య
తనయుఁడన సుబ్బా భక్తుఁడొనరపలుక
నాయుధమ్ములు గల లక్షణములు దెలిసి. 8

సీ. శ్రీరాయరఘునాథ ధారుణేంద్రుఁడు మెచ్చ
నయగుణసాంద్రుఁడా నల్లపిచ్చ
రాఖ్యవీరునిపుత్రు రసికశిరోమణి
నవనప్పధీర సద్వినయచరిత
పనివారు పలుకంగఁ గని ఖడ్గలక్షణం
బిదియెల్ల పద్యసాహిత్యరీతి
విపరించిపలికితి కవివరుల్ రణశుద్ధ
వీరులు మెచ్చఁగా వినుతశీల

గీ. సకలసౌభాగ్యసంతాన సాంద్రుండగుచు
ప్రబల విఖ్యాతకులపయోరాశి చంద్రుఁ
డగుచు కైలాసపతి కృపకధికలీల
ధరణి విలసిల్లు నాచంద్రతారకముగ. 9

గీ. ఇటుల దీవించి కవివరు లెల్ల పొగడ
సరసమైనట్టి ఖడ్గలక్షణశిరోమ
ణియను నీకృతికైలాసనిటలనయను
విపులకరుణను వివరింతు వినయపరుఁడ. 10

సీ. వారధి నీరెల్లనోరులనెత్తి యా
చీమతాపానంబు జేసినట్లు
మదమేనుగను జీరి గదిమిదగ్గిర జేర్చి
పట్టినిల్పినరీతి ప్రబలఖడ్గ
జాతి గుణములనెల్ల చాల విచారించి
తెలిపితి కృతిగాను తెలిసినంత
సుకవులెల్లను మరిజూచి తప్పులదిద్ద
వలయును జనులెల్ల వారభువిని

తే. మరియు జాతులు కలవింక నరసిజూచి
తెలివిపరుఁడైన ఘనమతి తెలిసికొనును
హృదయ మందలి తనభక్తుఁడెంచి
వరములిచ్చిన కైలాసపతి కరుణను. 11

క. కవులార! మీకు నెప్పుడు
భువిలోభక్తుఁడని నన్ను పుత్రునిరీతిఁ
నవరణగా నెంచి ధరణి
దివిజేంద్రులు దీనితప్పు దిద్దుఁడు దయతోఁ. 12

వ. అందంబగు నీ ప్రబంధంబు ముందుముందుగా యిందుశేఖరజటా
జూటనానటద్ధ్వనిరంగధ భంగ భంగీకార సముత్తుంగ సంఘాతజాంఘీ

కారనిబిడఘాటీ సముల్లాసములకు శ్రీరామచంద్రకరుణారస విభాసుర విధూవధూటీ విలాసంబుల పూర్వంబున హరిహర బ్రహ్మాదులకు నిఖిలసురాసుర మానవలోకంబులకై విశ్వకర్మచే లక్షణ శాస్త్ర విరాజితంబులుగా నిర్మితంబులగు అసి, ముసల, ముద్గర, క్షోహణ, కణయ, కంపిణి. శిల్లు, భల్లాతక, భిండివాల, కరవాల, కుంతల. కోదండ, కఠారి, తోమర, పరశు, త్రిశూల, వజ్రముష్టి, గద, అపుది, అంగల, అంతక, వంకిణి, చక్ర, సబళ, ఈటె, ఇనుపకోల, శలకట్టె, పట్టశ, ప్రకూర్మ, నఖర, మయూర్దండనారసంబు మొదలయిన ద్వాత్రింశాయుధంబులందలి అత్యుత్తమంబైన అసియను యాయుధంబునకు లక్ష్మీనారాయణసంవాదమనే గ్రంథమందలి చెప్పంబడిన, ప్రకారంబుగా లక్షణంబులను అభిధానంబులను గుణాగుణంబులను విస్తరించి తెనుఁగున తేటపఱచెద. అది యెట్లనిన. హస్తంబుల్, మకరంబుల్, జవబల్, మకైర్, వాజలల్ క్రైమానిఫిరంగు, తురాఫిరంగు, యెక్కేల్ ఫిరంగు, దోర్యాఫిరంగు, కుష్కీఫిరంగు, ఫూర్తికాల్సైఫ్, నుక్కాసైపు, మకరబ్సైఫ్, రుకమ్మిసైఫ్, యిసుపాత్సైఫ్, మళయవారిసైఫ్, ఫులాంధసైఫ్, జజ్ఞాసైఫ్, పుతర్కసైఫ్, కుష్కీసైఫ్, యిసుపాతు, చాందుబందర్, గోవాబందర్, మహామద్బందర్, బెల్బందర్, నాట్బందర్, ఆరాబందర్, ఫ్రాంసుబందర్, జ్ఞాబందర్, ఫూర్తకేసీబందర్, యెనాబందళ్, మహామద్బందర్, బందరలయిమాని మోనాభిబందర్, తినాభిబందర్, వురేబం, పాముబందరు, డ్యాలుబందరు, బత్తాలిబందర్, కాయర్తేబందర్, ఇంగ్లీషుబందర్, యిందుస్తానీసురై, మారాపాసురై. భుజకాసురై, రాజాపాసురై, కంచకాసురై, పప్పపాసురై, అంబబాగీసురై, వాసికునిసురై, సాదాలాగుబురాల్సురై సుదాదాలాసురై. కల్కత్తాసురై, కత్తాసుకాసురై, సిద్ధోట్కాసురై. సురతానిశాయిసురై, కలియకెరాట్సురై, బండవార్త్యాగా, ప్యహంత్యాగ, అంబరీత్యాగ, రుమీత్యాగ, గుజరాత్

త్యాగ. బంద్యాళిత్యాగ, హిరాకిత్యాగ, వరకుసిల్ త్యాగ, అబ్దాల త్యాగ, జహాఁశాత్యాగ, ముత్తాఁ త్యాగ, బగ్దాత్యాగ, బహోరి త్యాగ, లహూరి త్యాగ, అకుపరిత్యాగ, అపరంగజపి త్యాగ, నిరవరిత్యాగ, బువాఁ త్యాగ, అఫజ్జాత్యాగ, మావలత్యాగ జికర త్యాగ, దేపగదిచాండాత్యాగ, బంగాళిత్యాగ, పట్ణాత్యాస, హైదరాబాద్ త్యాగ, మసుధాభాత్యాగ, సహజాపూర్ త్యాగ సెంచా త్యాగ, సిద్ధో టుత్యాగ, కచ్ఛనాత్యాగ, డాల్ మన్ కాన్ త్యాగ, చెంగమాత్యాగ, ఆలంగిరిత్యాగ, బాదశాసురతాఁ, శికందర్ వస్తాదిమీర్ సుమాహిర్, మహామందబాసి, విలాడి అబ్భాసి, బురాతిసావి అబ్భాసి, సాలువాల, ఖాండా, దుందుమాయెవఁ, మొదసు, మింశ్రీ, మకరబ్బురా, జబ్బురుదా, మక్కై బురుదా, హాలబ్బురుదా, తురాగురుదా, మక్కిగురుదా, ఢ్యోణ్యుర్యోగురుదా, రుంమ గురుదా, గుజరాగురుదా, ఆందబాదిగెరుదా, బాందూ గురుదా, గోసాగురుదా, తుంకహారుదురుదా, బేల్ గురుదా, నాల్ గురుదా, ఆరాగురుదా, ఆలయమానిగురుదా, ఫ్రాంసుగురుదా, జిజ్ఞాగురుదా, ప్రతఁకనగురుదా యెకనాభి మహమ్మద్ గురుదా, బందరు అవేమానిగురుదా, దోనాంబిగురుదా. తికాభిగురుదా, ఫ్యులాందగురుదా. పాముగురుదా, కాండల్ గురుదా, బత్తావిగురుదా, కామల్ గురుదా, ఇంగ్లీషుగురుదా, పాముగురుదా, యెకెల్ గురుదా, ఇవి మొదలైన జాతులకెల్లనున్న, కొత్తది, పాతది, నిడివియు, వెడలుపు, చాయధార, పెనకయు, చూరియు, జెడియు, డిగోర్యాలు, ముద్రలు పక్కలు, ఛాయలు, దూసుతుగళంబు. కంగు, ఆబల్, బిహారత్యాబల్ దురోగి ఇటువంటి గుణంబు లెయ్యవి యవి వర్ణించెద నవియెయ్యవి యనిన 13

ఉ, పాతది కొత్తదిఁ నిడివి పక్కలు చూరియుకాడి కాండలుఁ.
ఖ్యాతియు వాయుదాల్ పెనక గీతలు ముద్రలు పాము దోరయుఁ
జాతులు దూసు నిందుగళ ఛాయలు కప్పలు శ్యాబలున్న బ
ద్ధాతదు రోగియుఁ లఘుపు కంజిరు జిహ్మరు లన్నిజూడుమీ. 14

క. హస్తములు వేలునాలుగు
విస్తీర్ణము మధ్యదుర్గి బీజము ముద్రన్
సిస్తుగ పూజలు సేయను
సుస్థిరమై రాజ్యమేలు సుగుణాకరుండై. 15

క. ధనువును గడుసును వజ్రము
అనువుగ డోర్యాలు యయిదు హయమును హేమం
బును కల్పితకలశుండును
ఘన వైరుల కివియు మిత్తి కైలాసపతీ. 16

క. మేతాహాసం బోలును
నేలను దిగవైచి పైన నిబిడీశరమై
వేలకు కత్తులు పేర్చిన
దేలియు పైనుండు కొండదీపమురీతిన్. 17

క, మెఱువడిగల హాసంబుల్
సురదేవుని యాయుధంబు జోకుధనుండున్
ధరలో దొరక దపూర్వము
మఱి దొరికిన చక్రవర్తి మహిమలు పొందున్. 18

సీ, గడుసుసు వాయుదాల్ కడవెళ్ళ[నొకరీతి]
లాగనుపట్టు డోర్యాలు మూఁడు
ఈగె కాళ్లకు సమం బింపైన దుగళము
లవకాయ రీతినుండు పంక
పొడుగైదు జానులు పొల్లక పెనకయు
వెడలుపు మూడువేళ్లడరు నలుపు
చంద్రవంకలుచేర్చి సన్నబిందులుపైని
యుంచి ముందిరలుండు మించెనేని

తే. కత్తి బట్టిన చేతంబు గతిని వెలయు
దావు నిరవంపు త్యాగదై దనరు చూరి

వంపు వచ్చును బిగువుతో వంచి జూడ
జాతి మకరంబు లీరీతి సరవినుండు. 19

గీ. ఈగె ముద్రయు పల్లమై యింపుమీరి
రెండు దోర్యము లుండును రెండువేళ్లు
వెడదచాయ చిట్టాముద విత్తురీతి
వినుము నజ్జాతిమకరంబు విధము కొదువ. 20

సీ. వెనక దగ్గర నొక పిల్లదోరయునుండు
చెర్యడు నొక పెద్ద దోర్యమచట
చిట్టాముదంబుగింజల దాను దుగళంబు
కొలది వొంపులు ఖేలి కొనును మక్కి-
కోరి హాలపు జాతిగుణములు చూడంగ
పిన్నదోరయు వొంపు వెణకకిందు
నడుమొక్క నాభ్యాండు పొడుగు విస్తీర్ణమై
కడురమ్యమౌను యాకత్తిఁ జూడ

తే. తక్కుగుణమెల్ల రెంటికి తథ్యముగను
నుండు మకరంబు రీతిని నుర్విలోన
జాతివర్ణము లవిఁజూచి సరవిగాను
యేర్పరింతురు ఘను లవిమెదను దెలిసి. 21

సీ. గురుదాల విద్రియు కొలువ నాలుగు జాన్లు
వెనక వంపులు కల్గవెలయుచూను
నలికిడి పాముతో కలరీతి వెనకయు
నతిగాత్రములుగాఁగ నమరియుండు
యేజాతి కత్తైన ఆజాతి గురుదాలు
కలిగుండు మిక్కిలి కండమెందు
కిరయి మానఖిరంగు సరిఖోణ వెల్ రీతి
వెడలుపు వెలయును గడుసుమీరి

తే. పెనక చిటికెన వే ల్లావుదనరి కాటు
వెనకచూచిన మూడుండు వెలయునైదు
జాన్లుదుగళాలు సన్నమై చనును నిడివి
వక్క సంబెట మకరంబి వాటిద్రాల. 22

గీ. దోర్వ్యముండదు పెనకయు తోరమగును
నిడివి చిరుధూసు రెండువేళ్ల డరు వెడద
చప్పలైనట్టి పక్కతురాఫిరంగు
చౌకపై మొగ్గ లేఁతరంగు గేది ముద్ర. 23

క. చూరి(ని)దగ్గిర ఖేతిని
మీఁటిన వెనుపెంప్పు జాడ మితమైయుండున్
తీరా మక్కే జానివి
కోరు జినచ్చి ఫిరంగు గుణమెల్లతగన్. 24

సీ. పురుతకాల్ సైపునిన్ పొందు నాలవ జాన్లు
పొడవుతో కూడుక పొలుపు మీఱు
యీజాతికెల్లను యిరువంకవాయిదాల్
వెడలుపు మూడుకాల్ వేళ్లనమరు
నెడిపించుటలు కమ్మిపటుగాత్ర మందమై
దుగళము యొకరీతిఁ దోచుచుండు
దోరయమై దుండుదుత్తుఁ దీసి దినితో
నందులోపల ముద్ర లదియు వినుము

తే. బిందుకోణము బిందువు పేర్చిపైని
శిఖర ముంచిన రీతిగా చెలగుచుండు
కరమునిండు వొప్పు గదుసుగా జూపట్టు
బడుగునుండియు కొనదాక నరయు గుణము. 25

సీ. నిడివి నాల్గరజాన్లు వెడలుపు నాల్గువే
ళ్లమరియుండీ కత్తియందముగను
పేరాముదముగింజ దారి నీదుగుళంబు
కడవెళ్లల్యాగనుఁ గదసిపట్టు
నిండువంపునువరిచు నెనసి మక్కాముద్ర
సరివంచు మక్కాయి సైపునందు
మకరంబిసైపున మహినిదోర్యములాఁగ
కొదవెంత మకరంబి గుణములుండు

తే. రుంటుసైఫందు గుణములుయూఢి వినుము
పోలుచు దంతని దోరయ ముద్రపైని
దొండ ఆముదగింజబోల్ దుగళమింక
పురుతకాల్సైపు గుణములు పొందియుండు, 25

సీ. అనుపాతు సైపొందు యంచనాలుగు నర
జానులు నమరుండు చక్కగాను
వెడలుపు రెంకున్నరవేళ్లుండు యీనాల్లు
రీతిని దుగళంబు జాతినలుపు
గడుసుగానుండదు కడవెళ్లసొనయుండు
దుతైడు అడుగున దోర్యముండు
పురుతకాల్సైపున పొందినముద్రయుఁ
గలిగుండు దీనికి కంఠముందు

తే. మణియు వారిసైపు నాలుగు నరజాన్లు
నిడివియుండును యీ కత్తినీరు తెలుపు
మూడుకాల్ వేళ్లపట్టున మొనయు వెడద
లేదు దోర్యము నలముద్ర లించుకైన. 26

సీ. దోరయాములలోన పారు మామూల్ రీతి
వంకరపై మొగ్గ వాలుముద్ర
ఇంకను తురాసైపు లింపైన గుణములు
రుమ్మిసైపుల సద్గుణమ్ములుండు
బంతాయిసైపున పరగు నాలుగునర
జానులు నిడివియు పూనియుండు
వంపున నొకవంక వహితంపు దుగళము
బందరుగతి మీరు నందముగను

తే. కనకదుంతటిదోర్యంబు గలిగి వెడద
వేలురీతిని మెఱయును వెరకనదియు
ముద్రలుండదు దీనికి మొనసిఁజూడ
నివియె యీకత్తిగుణముల నెంచి జూడ. 27

సీ. మళయువాల్సైపు లమర్మమెల్లను జూడ
యరనాభిబేలంగు నింపుతోడ
నిడివినాలుగుజాన్లు వెడదరెండరవేళ్ల
కొలతను నిమ్మాచు కొమరుమిగుల
కరకవులాందాసైపు కత్తినాలుగుజాన్లు
వెడలుపుమూఁడు వేళ్లడగుచుండు
యొకపంటియడుగున నొంపును దానిపై
చక్రముద్రలు మూఁడు సరవినమరు

తే. కుష్కీసైపునకాల్ తక్కుకొలత యిందు
జానులుండు వెడలుపు సరవి వినుము
మూడునర్ధము వేళ్లుండు మొనసిచూడ
క్రొత్తకత్తికి కలిగిన గుణములమరు. 28

గీ. వహీగనాల్గుకాల్ జానుపక్కపోల్కి
ఢుంతదైసన్నలోతుగా దోర్యమొకటి

...ము ముద్రపై యందునుండు
...డు వేలి సుసాతు వెలయుకంపు. 29

...డు జిహ్వసైపు నిడివినాల్గు
...వును వెడలుపు సరవి రెండు
...డు దోర్యంబు విడువగళము
...ద్రయుపై చక్ర మమరియుండు. 30

...వు బొడుచును పొడుగునాల్గు
...డ నాలుగు వేళ్లు చాల వెలయు
...భియు కడవెళ్లడిడ వియగును
...చ్చను త్యాబలవహిడనర్చు. 31

...తివి సరిగా
...లు గాఫిరంగు గ్రుప్పిన రీతొ
... కాధి కత్తియు
కైలాసనాథ నెఱయోధులకుఁ. 32

...ందరునీటు జానులునాలుగు
...వెడలుపు మూడు వే ళ్లదరు నెలపు
...మిడిగింజ వదనుండుకై దువ
...లుగాగ నుండు బలికిపెనక
...చ్చును వాయిదాల్ గడుసాను
...గను పండ్లుదోర్యములు మూఁడు
...ందిరవిను సరవిగామూఁడుండు
...ర్యంబుమీదను తోరముగను

...గెలావబందరు వరయముద్ర
జాను నిడివియు వేళ్లుమూఁడు

సొంపుమూడు వేళ్ల వెడలుపు మరియుండు
దోర్యంబు మొరయుచుండు ఛాయ
యామిదగింజవోల్ వాయుగడుసు. 33

సీ. ఈ మహాద్బందరీ సేవంపగుచుండు
కాల్ తక్క నాలుగు గలుగుజాన్లు
వెలయువేలువెడద కలమెదల్ దోర్యముల్
రెండు పంకమామిడి విత్తు రీతి దనరు
ఆమీదగింజకు నధికమౌ దుగళంబు
వెడలపు మూఁడు వేళ్లదరియుండు
ఇరువంకవంపులు హితవుగావంచును
గడుసౌనులాగను కదిసిపట్టు

తే. కొన్నిటినిముద్రలుండును కొన్నిటినల
ముద్రలుండదు త్యాగడై మొనలుదనరు
ఇన్నిగుణములు దీనికి నెఱుఁగవలయు
లలిత సద్గుణయూధ కైలాసనాథ. 34

సీ. బేల్ బందరులరీతి వెడలుపు మూఁడువే
ళ్లమరియు నాల్గుకాల్లరయు జాన్లు
దోర్యాలురెండును దుగళము రెట్టింపు
నామిదె విత్తుకు నరయపంక
వొల్లిక వెలయును యెల్లపెనకచాల
దళముగానుండును ధారగడుసు
పారు పాములరీతి పరగుముద్రలు నాల్గు
బందరునాల్గు జాక్ నందముగను

మూఁడు వేళ్లను వెడలుపు మూఁడుదోర్య
ములును సన్నమౌ వెనకయు పొలుచుగాత్ర
మీనవంపౌను నలుపుసీల్ మెనుపొల్లి
ముద్రవంకియామిదగింజబోల్ దుగళము. 35

సీ. వెడద నారాబందరుల మూఁడువేళ్లను
నాలుగు కాల్జాను నరయనిడివి
రెండువేళ్వెడదయై యుండును దోర్యంబు
పక్కలు పొల్లుండు బళువు
చూరివెనుకను కాటు జోకగాపైనుండు
దుగళముల్ గాత్రమై తోచువంపు
అరియ వంచు నికమీఁదనలయిమాని
గుణంబునిడివి నాల్గుజాన్లునిండివెలయు.

తే. మూఁకుడు కొనకొన వెళ్లవెడలుపు
ముద్రలేదు నొవ్వటలు కందుదోరియంబొకటి
మీఁద అడుగగాత్రమై కొనసన్నమాను
వంపవచ్చును దుగళమామిదగింజ హెచ్చుగడుసు. 36

సీ. చక్క అలయుమార్గ సిగ్గు పక్కలుపొల్లి
నాలుగునరజాన్లు మూఁడువేళ్లు
వెడలపు దోర్యము విస్తీర్ణమై కట్టి
తలక్రిందుగా తెల్పుతలలనీడి
నాయిదాల్ గడుసౌనువంపులు వచ్చును
దుగళముగాత్రమా తోచు తెలుఁపు
పంకలుపొల్యుండు ప్రాసుబందరు నాల్గు
జానులు నిడివియు దీనివెడద

తే. వేళ్లురెండు చిట్టామిద విత్తుచాయ
పిన్నదోర్యము చెర్యుండుపెదదోర్వ
మొకటికాన సన్నము పెనకనొంపు
బలిసిసరవివంపు వచ్చునలుపు చక్రముద్ర. 37

క. నిడివియు మూఁడున్నర జానులు
వెడలుపు రెండున్నరవేళ్లు వెలయుచునుండున్

గుడుసరయి ధారలు వొంపును
మిడిజిజ్ఞాబందరిలను మేతాముద్రల్. 38

సీ. బుడుతకీచు పోర్చుగీసూ బందరు పొడవునాలుగు
జాన్లువీపులావగు రెండువేళ్ల వెడద
పిల్లదోయమును పెద్దదోరయము
చక్కఁగా వీఁసిల్లు చక్రముద్ర
ఇకమహామిద్బంద రేఖనాభియునొప్పు
జానులు మూఁడర దీని నిడివి
వీపువంపుపెనక వెడదరెందర
వేళ్లు కప్పును నల్లనౌక త్తికొత్త

గీ. బందరలయిమార్క నాలుగు పరకజాన్లు
మూఁడు పెద్దవేల్ వెడద మొనసియుండు
కత్తి పలుచనదుగుళంబు గాత్రమూను
వంపువచ్చును యదియు జరాటనిడివి. 39

సీ. దోనాభి బందరు దుగళమల్పత నొప్పు
వెడలుపు రెండరవేళ్ల నమరు
తీనాభి బందరు జానులు నాల్గర
మూడు వేల్వెడలుపు ముద్రలేదు
దోర్యముల్ మూడుండు దుగళముగొప్ప
తాచప్పెటి వంకలు కప్పురూపు
సొనగల్గియుండును సొంపుగా మకరంజి
ముద్దరలుండును మొనయు నిడివి

ఏకనాభియు దానిపై నెసగు రెండు
దోర్యాలు లాంట్రాకత్తి తోచునిటులు
..............................
..............................॥ 40

సీ. పాములబందరు నీటుపరగనాల్గర
జాన్లువెడలుపు నాల్గువేల్వ్రేలయుచుండు
పాముచటమురీతి పడియుండు దుళముల్
వురగంబురీతిని వొప్పుముద్ర
రౌడ్యాలబందరు కత్తినిడుపు నాల్గర
జాను మూడువేళ్లడరువెడద
దుగళముల్ ఛాయలు తోరమై కనుపింప
సొంపొందు సోగయె వొంపులేక

గీ. పద్మముద్రయు బత్తావి బందరిలను
జానులు మూడు నాలుగు వేల్సరవినెడద
దోర్యమొక్కట దీనికి ధారలెరిగి
జాతినెరుగును బుద్ధిశాలుఁ డిలను. 41

గీ. జానులు నాలుగు బొట్నవేల్ సమమువెడద
నాల్గుదనరారు దోర్యముల్ నలుపుమీరి
పద్మము ముద్రయు దానిపై ప్రబలుచొందు
ముద్రకాయలు బందరువును ధరను. 42

గీ. ఇంగిలీషు బందరు దుగళమీఁగె కాళ్లు
జానులు నాల్గువెడలుపు జాతివేళ్లు
మూఁడుదోర్యంబు నొక్కట మూఁడురెండు
చొందుముద్రయు సన్నమై పొందుసియు
పట్టికడ వ్రెళ్లవాయిదాల్ ప్రక్కనుండు. 43

గీ. పాత బంతావిబందరు రీతివినుము
జాన్లునాలుగు మూఁడుండు చాలవెడద
నాల్గువేళ్లుండు దోర్యముల్ కల్గుమూఁడు
కప్పుగోల్ముద్ర సన్నదుగళి మొప్పు. 44

సీ. హిందుస్థాన్ సురైక్ విధములు వివరింప
పొడుగు మూఁడరజాను లడుగునందు
అపరంజిచీలయు అందమైన మీఁదుండు
వెడలుపుమూఁడువేల్ వెలయుచుండు
సన్నమై దోర్యంబు చక్కగానడుమను
యొకటుండు తెలియుము ప్రకటముగను
తెల్లనిఛాయల నుల్లసిల్లుచునుండు
రూపాయిపట్టు రూఢిమెఱయ

గీ. శుభముకలుగును మానహాయిసురయు
నెడివిమూఁడున్నరజాను వెడలుపుమూఁడువేళ్లు
గొప్పదోర్యము దుంతడినొప్పు నడుమ
పట్టెకడవెళ్లవాయిదాల్ పక్కనుండు. 45

సీ. భుజుకాసురై కత్తి పొడుగునాల్గరజాను
వెడలుపు మూఁడువేళ్లడుగుమాల
సొగసురాజాషాయి సురాయి నాలుగు
జానువెడలుపు నాల్లరవేళ్లనమరు
అవిశాకువెడలుపు అందమాపట్టెయు
కొనపై బంగారు కట్టియుండు
కచ్చీసురై ముద్రగణితి మూఁడరజాన్లు
వెడలుపు మూఁడువేల్ నిడివిదోర్య

గీ. మలరియుండు పష్వాషాసురాయి నిడివి
కాలుతక్కువజానులు నాల్గువెడద
మూఁడునవేళ్లు కొనచూఱి ముందువంపు
గడుసుకరువాయి పట్టెగాత్రదుగళ. 46

సీ. అంజియబాగుసురాయి కంజిరు నిడివియు
మూఁడుముక్కాలు జాన్లు మూఁడువేళ్లు
వెడలుపు వాయిదాల్ పీకెయు పట్టియు
దుగళగాత్రంబుగాఁ దోచుచుండు
సానవాసానియు సరవి చెప్పెదవిను
నిడివియు కాల్తక్కు నాల్గుజాన్లు
వెడద నాలుగువేళ్లు గడుసైనవాయిదాల్
కరుకులు రాలుండు తరచుగాను

తే. దుగళగాత్రంబుపట్టియు దోచువంక
గోరులుంచిన తీరున మీరు ముద్ర
వెగడు శిందోటు సురాయికి నిడివి జాను
మూఁడరవేళ్ళవిప్పు మూఁడుదుగళ. 43

సీ. సురతానిశాయి సుర్రై సొంపున మూఁడర
జానులు నమరుండు చక్కగాను
వెడలుపు మూఁడువేల్ వెలిలేనికత్తియా
గోరులోతాను యాధోర్యమొకటి
కడవెళ్లనుండును కరుకైన వాయుదాల్
పట్టెయుండును మీఱి ప్రక్కలందు
కలియకోటు సురాయికొలిచిచూచిన నాల్గు
జానులు నమరుండు చక్కగాను

వేళ్లుమూఁడౌను వెడలుపు మించ బళువు
కలిగియుండు కంగీరుకలసి మిగుల
ధారదగ్గరపట్టెయు దనరియుండు
దిగుడు జాత్యని మరి యివి తెలియవలెను. 44

సీ. బడుదవాల్ త్యాగాలు పొడుగు మూఁడరజాన్లు
అడుగు మూఁడు వేల్ వెడలుపుగను
ఖేతిలో మూఁడర క్రమమున వేళ్లుండు
గాజుపల్లును పంటు గడుసుధార
గడివి చుట్టకమ్మిచాచిన రీతిని
దుగళేము పడియుండు తోచునీరు
అలలుతోచినరీతి బలసి వాల్లిక వీపు
కండలు గలిగుండు కత్తిపొంపు

గీ. చౌకమందు నపార్శ్వయక్షరములుండు
నవియు ముద్రయు నివియెల్ల నరసి మిగుల
కోరిఁ జూడుము ఘనతగా గుణము దెలసి
ఖ్యాతిగలుగును వానర యీ లక్షణములోన. 45

సీ. ఘనవ్యాహ్ త్యాగకు కలుగు మూఁడరజాన్లు.
కొనవేళ్లు యడుగున కొద్దివేళ్లు
వెడలుపుఖేతిలో వేల్ మూఁడు కాలుండు
వాయిదాల్ పలుచన వంపుకత్తి
కడవెళ్ల సొనగల్లు గడుసుగ దంతముల్
గాజును ల్యాగను కదిసిపట్టు
సన్నత్యాబళువుండు జవరణగాపైని
నల్లనైనీరులు నలినమగును

గీ. మేటువెత్తినచేతికి పూటలేక చులక
నైయుండు మిగులను సొంపుమీరి
బల్లిగుడ్లను పోలిక పరగు ముద్ర
నందు నుండును వరపార్శ్వయక్షరములు, 46

సీ. అబరిత్యాగకు మూఁడరజాన్లు నిడివియు
అడుగున మూఁడువేళ్లణగియుండు
మూఁడుకాల్వేళ్లు నంపుమొనయును నలఖేతి
కండలు కలిగుండు గడుసుధార
పల్లుగాజునుల్యాగ పంటును మొనదాక
సన్నత్యాబలుగాను ఛాయదోచు
కత్తిని యపరంజికలవేసి. జేసుండు
యలిజూడ దోచును యందమలర

గీ. కనుమూసి మీటలపైగాను కాసులయంత
ముద్రలుండును కొన్ని మొనసిజూడ
కోరిజూచినవారికి గుణము లెల్ల
తెలియవచ్చును భువిలోన తేటగాను. 47

సీ. రుమ్మిత్యాగకుజాను రూఢిగా మూఁడరయడు
గున మూఁడరవేల్వెడిదలగును
ఖేతినాలుగువేళ్లరీతిని వెడలుపు
యిందున కలిగుండు నీనెవంపు
చిన్నికాసులురీతి జమిటాలపై ముద్ర
శిబిరంబు రీతిని చెలగుచాయ
గుజరాతిత్యాగకు లవకాల్ తక్కువ
నాల్గుజాన్లుండు మూఁడువేళ్లు

తే. వెడదలుండును యడుగున వెలయు ఖేతి
యందువెడలుపువేలు మూఁడరయుకలుగ
పెద్ద ఆమిదగింజ బోల్ కద్దుగళము
ల్యాగపట్టును కత్తిపై యీగెముద్ర. 48

సీ. బంద్యాసుత్యాగాకు పరగ మూఁడరజాన్లు
నిడివియు తగియుండు యడుగునందు
కొనవేళ్లుమూఁడుండు కొట్టియుఖేరిలో
కాల్ మూఁడు వేళ్లుండు గబ్బిభూసు
ల్యాగపల్లును పంటు యీకెముద్రయు నేక
నాభిహిరాఁ త్యాగ నయమువినుము
పొడుగు మూఁడరజాన్లు పొందున కొనవేళ్లు
మూఁడుండు యడుగున మొనసిచూడ

తే. ఖేతిమూఁడర వేళ్లురీతిని వెనకయు
పొల్లి యడ్డముగాను పొందుల్యాగ
కత్తిచప్పెటలగు దాను గడుసుగలగి
ల్యాగపంటును చాదాయి మొహారుముద్ర. 49

సీ. ఇట యిరారిత్యాగ కిరవైన నిడివియు
అరమూఁడుజానులు నమరియుండు
చేతిలో మూఁడరకిందియు మూఁడుండు
కొన వేళ్లుకొలత యీ గొద్దివెడద
కత్తి చప్పెటవంపుఁ గలిగియుండును దీని
దుగళంబుయులలరీతగును మిగుల
తోరమై పేచెణకయు తోచు నంతటమై
మొనసి పల్లుపంటు మొహారుముద్ర

తే. పరగుశీల్ త్యాగ లడుగున యరయరెండు
వేళ్లు ఖేతిలోమూఁడుండు విలువంపునిడివి
నిడివిమూఁడుకాల్ జాను పొల్లిపెనకల
గును చప్పెటదాయి యగును ముద్ర. 50

సీ. అబ్బాళిత్యాగ కింపలరు నాలుగుజాన్లు
అరమూఁడు కొనవేళ్లు యడుగువొంపు
నాల్గువేల్ ఖేతిలో నయమైన వెడలుపు
పొల్లుండు నల్లకప్పు
వాయిదాల్ పెణకందు వరపిల్లదోరయు
చేరుండు నాల్గువేల్ తీరనిడివి
దుగళమల్లెసరాలు తోదుననుండును
తెగవాజిరామద తెగునువినుము

తే. బటువుముద్రయు చిమిటాల పైనుండు
అందురాశుండు యాకత్తి నరయపేరు
ఇలను కలిగిన త్యాగాల కెల్లనిట్లు
జూడు మాజాతి యివియని సొబగు తెలుసు. 51

సీ. జాహోసాత్యాగాకు జానులుమూఁడర
వెడలుపు రెండరవేళ్ల నడుగు
ఖేతిలో మూడువేల్ క్రియయైన విలువంపు
కాడికొద్దినుండి కప్పుఁగలిగి
దుగళమామిదగింజ వగనైన పెణకయు
పోల్పండు నడవెళ్ల గడుసులగును
చిమిటాలపంకను చేరుండు బాదాయి
మొహరు ముద్దిరచూట్కి-మోడమలర

తే. అరయములు తానిత్యాగకు నరయ ఖేతి
నిడివిపెణకయు వాయిదాల్ గడుసు తెల్ల
కోరిచూడు బగ్దాత్యాగ గుణములుండు
చౌకముద్రయు గాత్రమై చాళదుగళ. 52

సీ. పరగ పద్గాత్యాగ బల్లకపేవంపు
నందు దుగళిగాత్ర మమరియుండు
నిడివి మూఁడరజాన్లు నిండును వెడలుపు
నడుగున రెండరవేళ్లు ఖేతి
అందున మూఁడువేళ్ల మరును పెణకయు
పొల్లి చప్పెటయాను యుల్లసిల్లు
వాయిదాల్ గడుసుండు వహిచౌకముద్రయు
లాహోరిత్యాగాల లక్షణంబు

తే. వినుము మొదటను రెండుకాల్ వేళ్లు వెడద
ఖేతి రెండుముక్కాల్ గడుసు నలుపు
పొడుగు మూఁడరజాన్లాను పొల్లపెనక
దుగళమల్పుండు బాదాయి తోచుముద్ర, 53

సీ. అగుపరిత్యాగాకు నడుగున వెడలుపు
కాల్తక్కు మూఁడువే ళ్లతిగియుండు
మూఁడువేలవెడల్పు మొనయుఖేతిలో
నిడివి మూఁడరజాన్లు నిచ్చుయు
బటువుగాత్రముగాను పడియుండు అబరులు
యీనెదొంపు పెణకయొసగపొల్లి
కడవెళ్లగడుసుండు గాజుపల్లును పట్టు
చౌకముద్రయు నొప్పు సరివినుండు

తే. కోరి అపరంగ జపత్యాగ గుణము వినుము
కాడివెడద వినాగను గలుగు గుణము
జాహశారీతి నుండును చక్కగాను
దీనిభావంబు తెలుతురు తెలివిపరులు, 54

సీ. నరవరిత్యాగ మూఁడరజాన్లు నిడివియు
రెండుముక్కాలు వేళ్లు నిండువెడద
యరమూఁడువేళ్లుండు అరకయగా ఖేతిని
.......................
బటువు మొహరుముద్ర భాసిల్లు నడుగున
యిలను బుదాకుత్యాగ లింక వినుము
నిడివిమూఁడుజాన్లుండు వెడకాలు తక్కువ
మూఁడువేల్ ఛాయలు త్యాగఖేతి

గీ. మూఁడునరవేళ్లు పలువంపు పొల్లు పెణక
పరగుచప్పెట పక్కలు భటువుముద్ర
..............................
.............................. 55

గీ. నిడుపు అపజ్జత్యాగాకు మూఁడునరయు
జాను గడుసౌను నడుగున పూనువేళ్లు
మూఁడుఖేతిలో నరమూఁడు వేళ్లుఛాయ
మొనయు సింహంబు రీతిని మొహరుముద్ర. 56

సీ. మావిలి త్యాగకు మనువింపు మొదటను
మూఁడు వేళ్లుఖేతిని నాల్గువేళ్లు
మూడుముప్పావుజాన్ మొననుండు నిడివియు
పెణకపుల్లి పక్క లణగితోఁచు
దోర్య మైయుండును దుగళంబు గాత్రమై
కత్తియు గడుసౌను కనుదు ముద్ర
బీదరిత్యాగ నడుగున వెడలుపు మూఁడువేల్
అరమూఁడుఖేతిని నమరు వేళ్లు

మూఁడుముక్కాను జానులుచూడపెనక
వంకలును చప్పటలు కత్తిబరువు గలిగి
యుండదొకరీతి దుగళంబు లొప్పుధార
ముద్రలుండవు దీనికి తథ్యముగను. 57

సీ. తగు దేవగడి ఖాండాత్యాగ వంపౌను యీ
దుగళసన్నముగాను దూరముండు
బిదరిత్యాగల రీతి కొదవెల్ల నుండును
బంగాలత్యాగకు బాతి వినుము
సన్నమై దుగళంబు చక్కగానుండును
ముందరనుండదు మొనసిచూడు
తక్కెల్ల నరవరిత్యాగ పోలికనుండు
పరగ పట్నత్యాగ పక్కపొల్లు

యుండునిడివిగా నొక దోర్యమొనర నడుమ
చంద్రవంకను చేర్చిన జాడముద్ర
కొదవ అవరంగజెబుత్యాగ గుణములెల్ల
కలిగియుండును దీనికి క్రమముగాను. 58

సీ. హైదరాబాత్యాగకు దుగళమారోగి
బటువుముద్రలు చాల పరగుచుండు
వెడలుపు నిడివియు వీపును వంకలు
అవరంగజెబురీతి నలరుచుండు
మగుదాబాషూగ్త్యాగ వగలు చెప్పెద విను
ధారకు నడుగున దోర్యముండు
అవినాల్గువేళ్లుండు అందమ్ము వెలయంగ
దుగళము సన్నమై తోచుచుండు

నిడివి వెడలుపు పక్కలు గడుసు పెణక
వెల్ల జూడ బద్దాత్యాగ రీతినుండు
ముద్రలేకనె యీజాతిని బోల్చుగతిని
అల్కగానుండు చేతికి నందముగను. 59

సీ. పహజాపూత్యాగ జానులు మూఁడర
వెడలుపురెండరరై దుగళఖేతి
మూఁడువేల్ పెణకయు పొల్లును పోలికల్
పరగుత్యాగ బలఛాయ పలచనగును
వెలయు పోందాత్యాగ వెడలుపుకాల్ తక్క
మూఁడువేల్ ఖేతియు మూఁడువేళ్లు
నిడివి మూఁడరజాను గడుసౌను వాయిదాల్
బటువైన అంబరులు వంపుగురుద

తే. అలరు శిందోటు త్యాగాకు అడుగుమూఁడు
వేళ్ల వెడలుపు మూఁడరవేళ్ల ఖేతి
యీనె వంపౌను ఖేతిలో పూనుగడుసు
పొడుగు మూఁడుకాల్ జానులు బళువుకప్పు. 60

సీ. కచ్చికాత్యాగాకు కాల్ మూఁడువేళ్లుండు
కాడిమూఁడరవేళ్లు కత్తిబళువు
గడుసుండుఖేతిలో క్రమములుండును ముద్ర
నల్లనీను కత్తి నాల్గుజాన్లు
దలమీరుఖాణ త్యాగ గడుసున మూఁడువేళ్లు
ఖేతిలో కాల్మూఁడు కలదువేళ్లు
నిడివి మూఁడరజాను కడవెల్ల దోర్యంబు
యొకటుండు నడుమను ప్రకటముగను

తే. కత్తిధారల మీదను గడుసుగలిగి
దుగళముండును సన్నమైజోడుగాను
పొంకమై తగు చంద్రవంకముద్ర
యుంచియుండును దీనికి యువిదలోన. 61

గీ. కలిగించె మాత్యాగ ముక్కాలురెండు
వేళ్లుఖేతిని మూఁడుకాల్ వేళ్లు వెడద
మూఁడునరజాను కప్పును గడుసుపెణక
పక్కమున నాద్యయా చంద్రవంకముద్ర. 62

గీ. నిడుద మూఁడరజానులు అడుగుత్యాగ
రెండు అరవేళ్లుఖేతిలో అరయమూఁడు
పెణకచేరుండు దోర్యంబు యొకటిపెద్ద
చేతిబళుఖేతి గడుసు అలంగిరియును. 63

సీ. బాదశాసుల్తాన్ శిఖందర్ వస్తాది మీరి
సుమా మహమ్మదబ్బాసి యనగ
ద్వితియన నర్థము వెడలుపువేళ్లుండు
జానులర్థము మూడుసరియ నిడివి
కొనసగిలిమించ పెణకయద్దారుండు
వంకెలు వీపు చప్పెటలుగాను
పలురందా గాజుపంటును కడవెళ్ల
బల్లకట్టైలవంపు బరువులేదు

తే. బీరకాయల చిక్కపై పెద్దచాయ
లుండు వెలలేని యా ఖడ్గముర్విలోన
పరగు మిరావులో గనబటువుగాను
వెలయు అపరంజిలోముద్ర విశదముగను. 64

సీ. విలయాతియబ్బాసి విలువంపు మొహర్ముద్ర
తక్కిన గుణమెల్ల తథ్యముగను
మహమ్మదబ్బాసికి మఱిగల్గు గుణము
లుండును దీసికి నొప్పిదముగ
అనగ తురాశాని అబ్బాసిగుణములు
ముద్రమాత్ర లేక మునుపుచెప్పి
అబ్బాసి గుణములు నమరునుచక్కగా
మిశ్రికి బీరకాయ చిక్కబాయ

తే. కాలుతక్కువనాల్గుగలుగు జాను
వెడద మూఁడువేళ్లుండును వీపులావు
పెణకచేరుండు యొకదోర్యమింపుగాను
ధార కడుగున నాల్గువేళ్లు దనరు. 65

సీ. నాలువాల్ నిడివి యుకాత్తక్కు నాల్గుజాణ్
వెడలుపు రెండువేళ్వేలయు చుండు
కొనదాక పెణకయు కోరున దోరయా
పుక్కటియలు గాను నిగ్గునలుపు
వెలయు ఖాండాకత్తి వెడలుపు మూఁడువేల్
కాత్తక్కు నాల్గుజాణ్ కలదు నిడివి
అడుగున దుత్తడి మూఁడుదోర్యములుండు
అందుపై బటువులు అమరుముద్ర

తే. మీఁదను దుత్తెడు మూఁడు దోర్యాలుండు
కడవెళ్ల పెణకంచు బరువుముద్ర
కత్తిలగువు పెణకలగువు గాజుపంటు
పెద్దఆమిదగింజంత కందుదుగళ. 66

సీ. దుందుమానిడివియు సందు నాలుగుజాను
వెడలుపు రెండువేల్ విప్పుపుల్లి
వెడలుపై నాభ్యుండు కడవెళ్ల పెణకయు
పుక్కుటి అలుగాను వొంపుగడుసు
అడుగున మొహర్ వేశి అందుపై యసిరీతి
ముందర యుండును తథ్యముగను
యిల పెనుకత్తియు కొలవ నాల్గుజాను
వెడలుపు రెండువేల్వోలయుచుండు

తే. డోర్య మొకటుండు నడుమను నీరు తెలుపు
పొంకుటలు గాను దీనికి పోటమెండు
డోర్యాలు లేక యుండిన మొరసుకత్తి
అందరిని జూచి ముట్టరే యరసి జనులు. 67

సీ. మరిరుమ్మి గురుదాలు సరిగ దరజాను
నిడివియు వంపౌను సీరుకత్తి
కొనవేళ్లు మూఁడుండు కొద్దియు యడుగున
చేతిలో మూఁడరరీతి వేళ్లు
పేరామిదపుగింజ ధారను పెద్దది
దుగళము పడియుండు తోడుగాను
గాజుపల్లనుల్యా కడవెల్ల పండును
కప్పులు అపురుండు గడుసు పెణక

తే. వొనరుపిల్లదొరయముండు నొకటి నిడివి
మూఁడు తుండుగ వొక దోర్యముండు మధ్య
అడుగుకొనమీఁద పెనకను అరుదుకొండ
పెణదాకను గోరుముద్ర వేసియుండు. 68

సీ. వెలయు అందాబాదివెడలుపు రెండువేల్
నిడివి కాల్తక్కువ నిండజాను
తోర్యమూపెణకందు చేరుండు పక్కను
సన్నదోర్యము క త్తి మిన్నగాను
మరియొక్క దోర్యము మధ్యను దుగళము
సన్నమైతోచును చక్కగాను
గురుదాలముద్రయు కొనబందు లేకను
చంద్రవంకలు చేర్చు సరవినుండు

తే. దీని గుణమెల్ల యివియని తెలిసి ఘనులు
జాతికత్తిని చేపట్టు సమరమునను
జయముసేతురు మనమున భయముపడక
కీర్తివచ్చును కైలాసమూర్తి కృపను. 69

సీ. గుజ్రాతిగురుదాలు కొలువజాక్ముక్కాలు
మూఁడుసీటులు అడుగున రెండుకాలు
వేళ్లు చేతిలో జూడ వెడలించు కమ్మించు
మధ్యదోరయమూఁడు మగయు వినుము
పెణకదగ్గిర చేరి అణుకవైయొక దోర్య
మూఁడు వేళ్లుండునును అందముగ
పెణకందు దోరయంబుంది నావుండును
గాజుపల్లును పంటుగడుసు మీరి

తే. చేతియందున గాని కిందునైన
ఖాండవుండును చులకసౌ మెండుకప్పు
యీగెకాళ్ల రీతి దుగళము వీగ మీరి
ముద్రతీగయు రీతి ముందు కులకు. 70

చ. బరువును ధారలుఁ లెదులు వంచిన నిబ్బును మిట్టపల్లమై
సరియును లేక కత్తి యతిచప్పెట వాయును ధూసువుంకరీ
తోయ్యరశినముండు దీపెనక లుబ్బదు త్యాగడ లేకచూచినఁ
(?)నరకు త్తికుండు ముందరలోన దుప్పటల్యాగ కొత్తదై. 71

క. ఈ మహికత్తులనెల్లను
వేమారునిబంటు లెల్ల యీజాత్యనుచుఁ
నేమము జేసిన కొలతలు
తామే కొనవేళ్ల చేత తప్పక జూతురు. 72

గీ. ఛాయ తెలియును కడిగించి చక్కచూడ
ఖడ్గమందున సర్వంబు కలిగి దాని
మీద దిగువను తలకెల్ల మెర(యు చుండు)
చూరి నివిజూడ కలుగును శుభముకీడు. 73

క. ఛాయ లెసర్వము రీతికి
ఛాయెడపడి యుండు యసిని.........
ఛాయలు గనుగొని గెలుతురు
శ్రీయును కీర్తియును పొందు సిద్ధముయిలలోన్. 74

---

—: త ప్పొ ప్పు ల ప ట్టి క :—

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 1 | సాంద్రుండగుచు | సాంద్రుఁడగుచు |
| 3 | 19 | భక్తుఁడెంచి | భక్తుఁడెంచియెంచి |
| 6 | 14 | జోకుధ | జోకున |

# అనుబంధము. 1.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు - పుస్తకభాండాగారము

### గ్ర. సంఖ్య 95 ఖడ్గలక్షణము (వచనము)

ఇందుఁగత్తులపేరులు పొడవువెడలుపు లక్షణములు ముద్రలు పిడుల వివరము మొదలగునవి వ్రాయబడినవి.

కత్తులు- 1. హిందుస్థాన్ సురై 2. అభియాబాగు సురై 3. బల్దవాన్ త్యాగా 4. న్యహార్ త్యాగా 5. రుమ్మిత్యాగా 6. బింబుపాన్ త్యాగా 7. హీరానత్యాగా 8. అబ్బాలీత్యాగా 9. పరన్‌సెరీ త్యాగా 10. బద్దాత్యాగా 11. సరవరిత్యాగా 12. మావిపీత్యాగా 13. హైదరాబాద్ త్యాగా 14. కుచ్చిత్యాగా 15. చెంగ్లామాత్యాగా 16. విలాతి అబాసీ 17. ఖురాసాన్ అబాసీ 18. మందుమాంభీర 19. అండాబాదిగురుదా 20. ఎద్నెల్ అనునవి చెప్పఁబడినవి. ఒక్కదానికుదాహరణము.

ఖురాసాన్ ఆబాసీ- కత్తిగడుసుగానుండును. తక్కినలక్షణములు విలాతి ఆబాబవలెను.

మిశ్రకత్తి - (మిసర్‌కత్తి) కాలుతక్కువ నాలుగుజేనలు వెడలుపు మూఁడు వేళ్లు పెణికెదగ్గర నొకదోరెము. పెణికెలావు పిల్లదోరెము ౧/- బీరకాయ పీఁచువలె ఛాయ.

నాలువాలు - నిడివికిజేనలు పెణికి కొనదాఁక సన్నగానుండును నడుమ నొక దోరెము ఉక్కుటల్లు సీరునల్పువెడలుపు రెండువేళ్లు.

ఖండా - నిడివి కాతుకాలుతక్కువ నాలుగుజేసలు వెడల్పుకి వేళ్లు చూరి ముందువంగియుండును. అడుగు దుత్తెడు 3 దోరెసులు. పెటికె దగ్గెఱ కడవెళ్ళ పటువుముద్దర దుగళం నేరాముదపుగింజవలె కత్తి గడుసు రందాపట్టు దప్పం కత్తిలఘువు.

ఆయాతావులకత్తి యొక్కముద్రలు చిత్రింపబడియున్నవి ఘరుజాలు, డాల్‌లు, కెడముల పేరులు గుర్తుకొఱకు కొన్ని వ్రాసికొన్నారు,

కెడయములు- బరువుగానుండును కొత్తదికోసిన నేరేడుపండు చెక్కినట్లుండును. ప్రాంత గిలిన దోరబీరకాయ బిక్కునఁగోసినట్లుండును నఱకు దగినఁగూడి పోవును. నాలుగుతావులను బెట్టునది కెడయము తక్కినతావున పెట్టేది చిలుకట్టు.

---

## అనుబంధము. 2.

### దక్షిణాంధ్రవాఙ్మయము – పుదుకోట

| కవులు | గ్రంథములు | వివరములు | |
|---|---|---|---|
| 1. రఘునాథతొండమాన్ రాజకవి క్రీ.శ. 1769-89 | 1. పార్వతీపరిణయము | కావ్యము | సరస్వతీపత్రిక 1908 |
| | 2. కవిజనోజ్జీవని | సమస్యాపూరణములు | ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటితము 1937 |
| 2. నుదురుపాటి సీతారామయ్య ఉద్దండకవి క్రీ.శ. 1750 | ప్రశస్తిపద్యములు | | కొన్నిముద్రితములు |
| 3. శేషయ్యకవి క్రీ.శ. 1760 | ,, | | ,, |
| 4. నుదురుపాటి వెంకనకవి ఉద్దండకవి క్రీ శ. 1780 | 1. ఆంధ్రభాషార్ణవము | పద్యనిఘంటువు | వావిళ్ళముద్రాలయము 1910 |
| | 2. తొండమాన్వంశావళి | సీసమాలిక | ఆంధ్రసాహిత్యపరిషత్తు 1917 |
| | 3. మల్లుపురాణము | కావ్యము | అముద్రితము |
| | 4. రఘునాథీయము | అలంకారము | ,, |
| | 5. పార్వతీకల్యాణము | యక్షగానము | ,, |
| | 6. బృహన్నాయికాదండకము | | ,, [ముద్రితము |
| 5. నవనర్ప | ఖడ్గలక్షణశిరోమణి | ప్రాచ్యగ్రంథమాల | మదరాసు ప్రభుత్వ |
| 6. మన్నారయ్య క్రీ.శ. 1800 | రసమంజరి | అలంకారము పద్యము | ,, |
| 7. నుదురుపాటి సాంబశివకవి క్రీ.శ. 1800 | 1. బిల్హణీయము | ప్రబంధము | ,, |
| | 2. తొండమాన్వంశప్రతాపమాలిక | సీసమాలిక | ఆంధ్రసాహిత్యపరిషత్తు 1918 |
| 8. సూర్యశేఖరయ్య | ప్రశస్తిపద్యములు | | |
| 9. విద్యత్కవి సాంబన్న క్రీ.శ. 1820 | చంద్రాననాదండకము | | అముద్రితము |

---